# విచిత్రవ్యక్తి

అది 1590 వ సంవత్సరం. ఆస్ట్రియా దేశం ప్రపంచంతో సంబంధం లేకుండా మడికట్టుకుని కూర్చున్నట్టు దూరంగా ఉండి నిద్రపోతోంది. ఆస్ట్రియాలో ఇంకా మధ్యయుగాల నాగరికతే[1] నడుస్తోంది. అప్పటి పరిస్థితి చూస్తే మధ్యయుగాల నాగరికత ఆస్ట్రియాలో శాశ్వతంగా తిష్ఠవేసుకుని కూర్చునేట్లు కనిపిస్తోంది. కొందరు ఆస్ట్రియాలో కాలమానం కొన్ని శతాబ్దాలు వెనకబడివుందనీ, మానసికంగాను ఆధ్యాత్మికంగాను ఆస్ట్రియా ఇంకా విశ్వాసవాదయుగం[2]లోనే ఉందనీ

---

(1) మధ్య యుగాలనాటి నాగరికత:— యూరప్ ఖండ చరిత్రని వాళ్ల చరిత్రకారులు మూడు పెద్ద భాగాలుగా విభజించారు; ప్రాచీన యుగం, మధ్యయుగం, నవీన యుగం అని. ప్రాచీనయుగంలో బానిసల పద్ధతి ఉండేది. మధ్య యుగంలో భూస్వామ్య పద్ధతి ఉండేది. నవీన యుగంలో పెట్టుబడిదారీ పద్ధతి ఉన్నది. మధ్యయుగంలో చర్చి, చక్రవర్తి, సామంతులు సామాన్యజనం మీద నిరంకుశాధికారం చెలాయించేవారు. ఈ యుగం బ్రిటన్, ఇటలీ మొదలైనదేశాల్లో పదిహేనవ శతాబ్దాంతంతో ఆఖరై, నవీన యుగం ప్రారంభమైంది.

(2) విశ్వాసవాదయుగం:- మధ్యయుగ నాగరికత శిఖరాలనందుకున్న కాలంలో విశ్వాసవాదం ప్రబలంగా ఉండేది. ఈ వాదం ప్రకారం ప్రజలు ఏ విషయాన్ని ప్రశ్నించగూడదు; పరిశోధించగూడదు; ఇదంతా భగవంతుడి సృష్టి అని, మొదటినుంచీ ప్రపంచం ఇలాగే ఉందనీ, చివరిదాకా ఇలాగే ఉంటుందనీ విశ్వసించాలి. అలా విశ్వసించనివాడు భగవద్విరోధి.

అనేవారు. విశ్వాసవాదయుగం అంటే వారి ఉద్దేశ్యంలో భూషణమేకాని దూషణంకాదని గుర్తించుకోవాలి. కనీసం మేమంతా దాన్ని భూషణగానే జమకట్టాం; ఇంకా ఆ యుగంలోనే ఉన్నందుకు గర్వించాం కూడా. నే నప్పటికి బాలుణ్ణయినా అదంతా నాకు బాగా జ్ఞాపకం ఉంది.

అవును; ఆస్ట్రియా దేశం ప్రపంచానికి దూరంగా ఉండి నిద్రపోతోంది. మా వూరు ఆస్ట్రియాకి సరిగా మధ్యలో ఉండటంచేత మరీ గాఢంగా నిద్రపోతోంది. చుట్టూ కొండలు, అడవులు; వాటి మధ్య శాంతంగా, ఏకాంతంగా నిద్రపోతోంది మా గ్రామం. మిగతా దేశాల్లో జరిగే సంఘటనల వార్తలేవి వచ్చి మా గ్రామపు గాఢనిద్రనీ, స్వప్నాలనీ చెదరగొట్టేవి కావు. ఆ వార్తలు రాని లోటుకూడా ఉండేదికాదు.

మా వూరికి ఒకపక్కన ఒకనది ప్రశాంతంగా ప్రవహించేది; నదిమీద ఆకాశంలో సోమరిగా తిరుగాడే తెలితెలిమబ్బుల ప్రతిబింబాలు, మెల్లిగా కదిలిపోయే పడవల ప్రతిబింబాలు కనిపించేవి. ఇంకొక పక్కన అడవు లుండేవి. అడవుల చివర ఒక పెద్ద కొండ శిఖరం; శిఖరంమీద ఒక పెద్దకోట; కోట గోడలనిండా, బురుజులనిండా అల్లిబిల్లిగా పెరిగిన ద్రాక్షలతలు. నది ఆవల దూరంగా ఎడమవైపున సూర్యరశ్మి చొరకుండా దట్టంగా చెట్లు పెరిగిన

పర్వతశ్రేణి. కుడివైపున నదిమీదికి వంగిచూస్తున్న పర్వతశిఖరం. ఈ పర్వతశిఖరానికి, ఆ పర్వతశ్రేణికీ మధ్య విశాలమైన మైదానం; మైదానం మధ్య చెదురుగా చుక్కల్లాగ కనిపించే ఇళ్లు, తోటలు, చెట్ల నీడలు......

కొన్ని మైళ్ళ చుట్టుపక్కలవరకూ ఆ ప్రాంతం ఒక సామంత రాజు స్వాధీనంలో ఉండేది. కొండ శిఖరం మీద కోట ఆయనదే. ఆయన సేవకులు కోట నెప్పుడూ నివాసయోగ్యంగా పరిశుభ్రం చేసి ఉంచేవారు. కాని రాజుగారు కాని, ఆయన కుటుంబీకులు గాని, ఎప్పుడూ అక్కడ ఉండేవారు కాదు. ఎప్పుడో అయిదేళ్ల కొకసారి వచ్చి కొన్నాళ్లుండిపోయేవారు. పరివారసమేతుడై రాజుగారు కోటలో విడిది చెయ్యటానికి వస్తే, జగదీశ్వరుడు దేవతో వచ్చినట్టు, ప్రపంచ సామ్రాజ్యాల వైభవాల నన్నిటినీ వెంటబెట్టుకుని వచ్చినట్లు సందడి అయ్యేది. ఆయన వెళ్ళిపోగానే మద్యపాన మహోత్సవం తర్వాత నీరసవాతావరణం ఏర్పడ్డట్టు నీరవంగా ఉండేది.

మా గ్రామనామధేయం ఈజెల్‌హార్స్ట్; మా కుర్రాళ్లకి అది స్వర్గసన్నిభంగా ఉండేది. అట్టే బడి బాధ ఉండేదికాదు. బళ్లో మాకు చెప్పేదల్లా, క్రైస్తవ ధర్మాలు తూచా తప్పకుండా పాటించాలనీ, ఏసుక్రీస్తు తల్లి అయిన మేరీకన్యను పూజించాలనీ, చర్చినీ, క్రైస్తవ భగవద్భక్తులను గౌరవించాలనీ—ఇంతే. ఇంతకంటే

మాకు బళ్లో ఇంకేమీ నేర్పేవాళ్లు కాదు. అసలు నేర్చుకోటానికి అధికారం కూడా లేదు. ఆరోజుల్లో ఆనవాయితీ ప్రకారం మామూలుజనానికి విజ్ఞానం కలిగించగూడదు. ప్రజలు విజ్ఞానవంతులైతే తమ స్థితి గతుల మీద అసంతృప్తి కలుగుతుంది; ప్రజల్ని ఈ విధంగాసృష్టించిన భగవంతుడు తన సృష్టివిధానం మీద ప్రజలకు అసంతృప్తి కలగటం సహించడు.

మా గ్రామానికి ఇద్దరు మతగురువు లుండేవారు. ఒకాయనపేరు ఫాదర్ అడాల్ఫ్. ఈయనకి క్రైస్తవమతంమీద చాలా శ్రద్ధాప్రపత్తు లుండేవి. చాలా కష్టపడి ప్రజలికి నీతులు బోధించేవాడు. మతగురువుగా ఫాదర్ అడాల్ఫ్‌కంటే సమర్థులైనవా ళ్ళుంటే ఉండవచ్చు; కాని ప్రజలు ఆయన పట్ల చూపించేటంత భయభక్తులు ఇంకెవరిమీద చూపించలేరని ఘంటాపథంగా చెప్పగలను. దీనికి ఒక కారణం ఉన్నది: ఫాదర్ అడాల్ఫ్‌కి సైతాను[3] అంటే బొత్తిగా భయంలేదు. సైతాను అంటే భయపడని

---

(3) సైతాను:— క్రైస్తవమత గ్రంథాల్లో సైతాను అనబడే వాడు దేవుడిమీద తిరుగుబాటుచేసి ఓడిపోయి నరకంలోకి తోసివేయబడిన ఒక మహాపాపి. నరకంలో పడిపోయినా సైతాను అప్పుడప్పుడు భూలోకంలోకి వచ్చి మానవులను వశపరచుకొని, వాళ్ళచేత పాపాలు చేయించి, వాళ్ళు స్వర్గానికి పోకుండా నరకంలో పడేట్టుచేసి, ఆ విధంగా దేవుడిమీద కసితీర్చుకుంటూ ఉంటాడు. పుణ్యంచేసే మనిషి భగవద్భక్తుడనీ, పాపం చేసే మనిషి సైతాను భక్తుడనీ క్రైస్తవుల నమ్మకం.

క్రైస్తవుడు నే నెరిగినంతవరకూ ఆయ నొక్కడే. ఆయన ధీమా చూసి, ఆయన దగ్గరేవో మంత్రసిద్ధులుండి ఉండాలనీ, లేకపోతే సైతానుపట్ల అంత నిర్లక్ష్యంగా సంచరించలేడనీ ప్రజలకి ఒక గట్టి నమ్మకం ఏర్పడింది.

సాధారణంగా సైతాన్ని బూతులు తిట్టనివాళ్లెవరూ ఉండరు; కాని ఆ తిట్టడంలో కూడా సైతానంటే భక్తీ, భయం, గౌరవం చూపిస్తారు కాని ఇష్టం వచ్చినట్టు మనసారా తిట్టరు. ఫాదర్ అడాల్ఫ అట్లా కాదు; సైతాన్ని నోటికొచ్చిన తిట్లల్లా తిట్టేవాడు. ఆ తిట్లు వింటుంటే వినేవాళ్ళకి గుండెలు పీచుపీచుమనేవి. ఆయన సైతాన్ని గడ్డిపోచ కింద లెక్కకట్టి వేళాకోళం చేసేవాడు. వినేవాళ్లు కళ్లుమూసుకుని శిలువను స్మరించుకుని తొందరగా అక్కణ్ణించి తప్పుకునేవారు; లేకపోతే ఏదో భయంకరమైన పని జరుగుతుందని వాళ్ల భయం.

ఫాదర్ అడల్ఫ సైతాన్ని ముఖాముఖి అనేకసార్లు కలుసుకున్నట్లు, కలుసుకున్నప్పుడల్లా "పోవాయ్ నీ లెక్కేమిటి?" అని నిర్లక్ష్యం చేసినట్లు ప్రతీతి. ప్రతీతి ఏమిటి—ఫాదర్ అడాల్ఫ స్వయంగా అలాగని చెప్పేవాడు. ఆయన చెప్పింది నిజమేననటానికి కనీసం ఒక ప్రబల సాక్ష్యం ఉంది: ఒకసారి ఆయన తన గదిలో ఉండగా సైతాను వచ్చాడు. ఫాదర్ అడాల్ఫ సైతానుతో చాలాసేపు యుద్ధం చేశాడు.

యుద్ధం చేస్తూచేస్తూ చేతులో ఉన్న సారాసీసా సైతానుమీదికి విసిరేశాడు. విసిరేశాడనటానికి నిదర్శనంగా తెల్లటిగోడమీద ఎర్రటిమరక, పగిలిన సీసా తాలూకు ముక్కలు ఈనాటికీ ఉన్నాయి.

మా రెండో మతగురువు ఫాదర్ పీటర్. ఆయనంటే మా అందరికీ ప్రేమ. ఆయనమీద కొందరు కిట్టనివాళ్లు ఒక అపనిందవేశారు: భగవంతుడు ప్రేమ స్వరూపుడని, తన పుత్రులైన మానవు లందరినీ పాపాత్ములు, పుణ్యాత్ములు అనే విచక్షణ లేకుండా చివరికి తన దగ్గిరికి చేర్చుకుంటాడని ఫాదర్ పీటర్ ఎవరితోనో ఎప్పుడో అన్నట్టు ఒక అపవాదు లేవదీశారు. నిజానికి ఆయనా మాట అనివుంటే అది ఘోరమైన మాటే. కాని ఫాదర్ పీటర్ ఆ మాట అన్నట్టు ఋజువులేదు. అలా అనే మనిషి కూడా కాడాయన. ఇలాంటి అబద్ధాలు ఆయన ఎప్పుడూ చెప్పడు. ఎంతో మంచి మనిషి. ఆ మాట చర్చిలో ప్రార్థనసభలో ఆయన అనలేదు. అనిఉంటే నలుగురూ అప్పుడే ఆ విషయం బయటపెట్టేవారు. బయట ఎక్కడో ఎప్పుడో ఎవరితోనో ఏ సందర్భంలోనో అన్నాట్ట. అన్నాడని కిట్టనివాళ్లు తేలిగ్గా కల్పించి ఉండవచ్చు. ఫాదర్ పీటర్ అంటే కిట్టనివా డొకడే ఉన్నాడు. అతడు మా పూరి జ్యోతిష్కుడు. ఊరిబైట పాడుపడిన గోపురగృహంలో ఉంటాడు. ఎప్పుడూ బయటికిరాడు. రాత్రిళ్ళు గోపురం చిటారున కూర్చుని నక్షత్రాలు శోధిస్తూ

ఉంటాడు. అతడు యుద్ధాల్ని గురించి, కరువుల్ని గురించి జోస్యం బాగా చెప్పగలడు. అదే మంత కష్టం కాదనుకోండి. ఎందుకంటే ఎక్కడో అక్కడ ఎప్పుడూ యుద్ధం జరుగుతూనే వుంటుంది, క్షామం తాండవిస్తూనే వుంటుంది. కాని అతడు మంచి జ్యోతిష్కుడనటానికి కారణ మేమిటంటే ఆయన దగ్గి రొక పెద్దగ్రంథం ఉంది. దాని సహాయంతో ఎవరి జాతకమైనా చెప్పగలడు; పోయిన వస్తువు లెక్క డున్నాయో ఖచ్చితంగా చెప్పగలడు. గ్రామంలో ఫాదర్ పీటర్ తప్పిస్తే జ్యోతిష్కుడంటే భయపడని వాడు లేడు. ఆ జ్యోతిష్కుడు గోపురందిగి పొడుగాటి టోపీ, నక్షత్రాల గుర్తులున్న వదులు అంగరఖా, ఒక చేతులో జ్యోతిషగ్రంథం, మరొక చేతులో మంత్ర దండం ధరించి గ్రామవీథుల్లో నడుస్తూఉంటే, సైతాన్‌తో దెబ్బలాడిన ఫాదర్ అడాల్ఫ్‌లాంటి సర్లక్ష్యపు మనిషి కూడా వళ్లు దగ్గిర పెట్టుకుని మెలిగేవాడు.

ఫాదర్ పీటర్ మాత్రం జ్యోతిష్కుణ్ణి లెక్క చేసేవాడుగాదు. వట్టి మోసగాడనీ, మూర్ఖుడనీ నిర సించేవాడు. ఇలా నిరసించడంవల్ల జ్యోతిష్కుడికి ఫాదర్ పీటర్ మీద సహజంగా ద్వేషం కలిగింది. ఫాదర్ పీటర్ మీద అపవాదు వేసింది జ్యోతిష్కుడే ననీ, అతడే ఆ ముక్క పైమతాధికారి దాకా చేర వేసి వుంటాడనీ మేమంతా అనుకున్నాం. భగ వంతుడు ప్రేమస్వరూపుడని ఫాదర్ పీటర్ తన

తమ్ముడు కూతురైన మార్గరెట్‌తో అన్నాడని పెద్ద మతాధికారికి ఫిర్యాదు చేయబడింది. తన పెత్తండ్రి ఆ ముక్క అనలేదని, ఆ ముసలాయనమీద కరుణించ వలసిందనీ మార్గరెట్ ఎంత మొత్తుకున్నా పెద్ద మతాధికారి వినిపించుకోలేదు. ఫాదర్ పీటర్‌ను ఉద్యోగం నుంచి తొలగించాడు. అసలు వెలివేసేవాడే కాని, వెలి వెయ్యటానికి తగినంత సాక్ష్యం దొరకనందున మతాధికారి అక్కడితో ఊరుకున్నాడు. ఫాదర్ పీటర్‌కు మతగురువు ఉద్యోగంపోయి రెండేళ్లయింది. ఆ ఉద్యోగం కూడా ఫాదర్ అడల్ఫ్‌కే లభించింది.

ఉద్యోగంపోయిన తర్వాత ఫాదర్ పీటర్‌కూ, మార్గరెట్‌కూ చాలా గడ్డురోజులు సంప్రాప్తమైనాయి. అంతకుముందు గ్రామంలోవారు వారిద్దరినీ ఎంత గౌరవించారో ఇప్పుడంత హీనంగా చూడసాగారు. వారి స్నేహితులంతా దూరదూరంగా తొలగిపోసాగారు. ఉద్యోగం పోయేనాటికి మార్గరెట్‌కు పద్దెనిమిదేళ్ళు. అంత చక్కని అమ్మాయి మా ఊళ్లో లేదు. పైగా మంచి తెలివితేటలుకల పిల్ల. కొందరు విద్యార్థులను కూడదీసి ఫీడేలు నేర్పేది. ఆవిధంగా ఇంటి ఖర్చులకి సరిపోయే డబ్బు కష్టపడి ఆర్జించేది. కాని ఫాదర్ పీటర్‌కు ఉద్యోగంపోయి, అవమానంపాలైన తర్వాత విద్యార్థులు క్రమంగా తగ్గిపోసాగారు. ఇప్పుడసలు వారిఇంటికి ఎవరూ వెళ్లటమే మానేశారు. గ్రామంలో యువతీయువకులు నృత్యోత్సవాలు, విందులు చేసు

కునేటప్పుడు మార్గరెట్‌ను పిలవటం మానేశారు. ఇదివరకు ఆమె చుట్టూ తుమ్మెదల్లాగ జుమ్మంటూ మూగే యువకులు ఇప్పుడామె చాయలకే రావటంలేదు— విల్హెల్మ్ మీస్లింగ్ అనే యువకుడు తప్ప. మార్గరెట్, ఆమె పెత్తండ్రి, స్నేహితులకు, బంధువులకు దూరమై ఒంటరిగా, చీకాకులో, చీకటిలో, చేతి చిల్లిగవ్వయినా లేని దరిద్రస్థితికి వచ్చారు. గుడ్డలు చిరిగి పోయాయి; రోజుకొక రొట్టెకూడా కొనలేని గతి పట్టింది. ఇంటియజమాని సాలమన్ ఐజాక్స ఇంట్లో నుంచి వెళ్లగొట్టేస్తానని తీవ్రంగా బెదిరించటం కూడా ప్రారంభించాడు.

## 2

మేము ముగ్గురం బాలురం మాత్రం ఎప్పుడూ ఒకరి నొకరం విడవకుండా స్నేహంగా తిరిగే వాళ్లం. పసి పిల్లలంగా ఉన్నప్పటి నుంచీ మాకు స్నేహం కలిసింది. ఏళ్లు గడిచిన కొద్దీ మా మైత్రి గాఢమైంది. ఒకడి పేరు నికొలాస్ బామన్; జడ్జీగా రబ్బాయి. రెండోవాడి పేరు సెప్పీ వోల్మియర్; ఒక పెద్ద హోటల్ యజమానకొడుకు. మూడోవాణ్ణి నేను. నా పేరు తియొడోర్ ఫిషర్; మానాన్న చర్చిలో పియానో వాద్యగాడు.

మేము ముగ్గురం ఆచుట్టు పక్కల కొండల్లోను, అడవుల్లోను విసుగూ విరామం లేకుండా విహరించే

వాళ్లం. అక్కడి ప్రతిచెట్టూ, ప్రతిగుట్టా, ప్రతిపుట్టా మాకు గుర్తే. తీరిక లభించినప్పుడల్లా — అంటే ఈదు లాడటం, పడవలో షికారు వెళ్లటం, చేపలు పట్టడం, మంచు మీదనో, కొండ వాలుల్లోనో ఆటలాడటం— మొదలైన జరూరు పనులేమీ లేనప్పుడల్లా అడవుల్లోనే తిరిగే వాళ్లం.

మిగతా కుర్రాళ్లకంటే మాకు ప్రత్యేకంగా ఉన్న ఘనత ఏమిటంటే కొండమీది కోటలోని తోటలో స్వేచ్ఛగా ఆడుకోటానికి మాకు హక్కుం డేది. కోటలోని ముసలి సేవకుడొకడు మాకు స్నేహితుడు. అతడు మమ్మల్ని యథేచ్ఛగా తోటలో ఆడుకో నిచ్చేవాడు. రాత్రిళ్లప్పుడు మాకు పూర్వ కాలపు కథలు, ఏవేవో వింతలు చెపుతూ కాలక్షేపం చేసేవాడు. మాకు పొగతాగటం నేర్పింది అతనే. అప్పుడప్పుడు కుండపోతగా వాన కురిసేది. అలాంటి సమయాల్లో ఆ రాత్రికి కోటలోనే ఉండిపోయే వాళ్లం. కోటబయట కొండమీద తొండాలతో కుమ్మరించినట్లు వాన కురుస్తూ, మెరుపు మెరుస్తూ, ఉరుము ఉరుముతూ ఉంటే మేము లోపల వెచ్చగా పొగ తాగుతూ మా వృద్ధస్నేహితుడు చెప్పే వింత కథలు వింటూ కూర్చునే వాళ్లం. ముఖ్యంగా దెయ్యాలు, యుద్ధాలు, హత్యలు, చిత్రవధలు వీటిని గురించిన భయంకర కథలు అతడు చెబుతుంటే చెవులు నిక్క బొడుచుకుని ఆసక్తితో వినేవాళ్లం.

మాత్రమేననీ చెప్పేవాడు. మాకు అతని మూలంగా ఎంత ధైర్యం కలిగిందంటే, అతనితో కలిసి కోట వెనకాల భూగృహాల చీకట్లోకి కూడా నిర్భయంగా వెళ్ళేవాళ్ళం. భూగృహంలో ఒక్కసారి మాత్రమే దెయ్యం కనిపించింది. ఆ దెయ్యం మసక మసకగా పొగలాగ దూరంగా తప్పుకుపోయింది. దాన్ని చూసి మేము రవ్వంతైనా చలించలేదు. ఈ దెయ్యం తన్ను, చాలాసార్లు నిద్ర లేపిందనీ, కాని ఎటువంటి హాని చెయ్యలేదనీ వృద్ధుడు చెప్పాడు. అన్నిటికంటె గొప్ప సంగతి ఇంకోటున్నది. వృద్ధుడు అనేకసార్లు సాక్షాత్తు స్వర్గం నుంచి దిగివచ్చిన దేవకన్యల్ని చూశాట్ట. దేవకన్యలకి రెక్కలు లేవట; బట్టలు తొడుక్కున్నారట; వాళ్ళు తనతో మామూలు మనుష్యుల్లాగే శుభ్రంగా మాట్లాడారట. దేవకన్యలు దెయ్యాల మాదిరిగా కాక చాలా సంతోషంగా, మందహాస ముఖాలతో కనిపించారట.

అది మేనెల. ఆకిందటి రాత్రి మా వృద్ధ మిత్రుడు చాలా దెయ్యాల కథలు చెప్పాడు. పొద్దున్నే లేచి అతనితో కూర్చుని భోజనం చేసి కొండ కిందకి వెళ్ళాము. నదిపైన వంతెన దాటి, ఎడమవైపున గల కొండలెక్కి, చెట్లతో నిండిన ఒక శిఖరం మీద కూర్చున్నాము. ఈ శిఖరం మా ఆటస్థలం. సాధారణంగా ఇక్కడికే వచ్చి కూర్చుంటూ ఉంటాము. పచ్చికమీద కాళ్ళు జాపుకుని పడుకుని, పైపు

వృద్ధుడు ఎక్కువగా తన అనుభవాలే వర్ణించేవాడు. ఎన్నోసార్లు దెయ్యాల్ని, మంత్రగత్తెలనీ[4] ఇంద్రజాలికులను అతడు చూశాట్ట. ఒకసారి కొండల్లో తిరుగుతుండగా తుపాను వచ్చిందట. అప్పుడు ఒక మెరుపు మెరిసి గాలిలో ఈదులాడుతూ, జడలు విరబోసుకుని పోతున్న దెయ్యాల గుంపులు కనిపించాయట. ఇంకా ఎన్నోసార్లు దెయ్యపు గబ్బిలాలు చూశాట్ట. ఈ గబ్బిలాలు మనుషుల్ని బలే చిత్రంగా చంపుతాయట. మనుషులు నిద్రపోతున్నపుడు పక్కమీద వాలి, మెలుకువ రాకుండా చల్లగా రెక్కలతో విసురుతూ మెడమీద కరిచి నెత్తురు పీల్చివేస్తూ చంపుతాయట.

వృద్ధుడు మాకు దెయ్యాల భయం పూర్తిగా పోగొట్టాడు. దెయ్యాలు మనుషుల్ని ఏమీ చెయ్యవని, పాపం వాటితో మాట్లాడే వాళ్లెవరూ లేక అలా ఒంటరిగా దిగులుగా ఏడుస్తూ భూలోకంలో తిరుగుతూ ఉంటాయనీ, వాటికి కావలసిందల్లా ప్రేమతో కూడిన ఒకమాట, ఒక చిరునవ్వ

---

(4) మంత్రగత్తెలని ఇంగ్లీషులో *Witches* అంటారు. సైతానుతోను, అతని తాలూకు భూతాలతోను సంబంధబాంధవ్యాలేర్పరుచుకుని వాళ్ళద్వారా కొన్ని శక్తులు సంపాయించి వాటిని మనుషులమీద ప్రయోగించే స్త్రీలని మంత్రగత్తెలంటారు. ఈ మంత్రగత్తెలు చర్చికి విరోధులు. మధ్యయుగ దినాలలో మంత్రగత్తె అని అనుమానం కలిగిన ఏ స్త్రీనైనా నిర్దాక్షిణ్యంగా పట్టుకుని నిలువునా నిప్పంటించి చంపేసేవారు.

కాలుస్తూ, మాకు రాత్రి వృద్ధుడు చెప్పిన వింత కథలను గూర్చి చర్చించాలని అనుకున్నాం. కాని పైపు కాల్చటానికి వీల్లేక పోయింది. చెకుముకి రాయి, ఉక్కు ముక్క వెంట తెచ్చుకోవటం మరిచిపోయి నందుకు చాలా విచారం కలిగింది.

ఇంతలో ఎక్కడి నుండి వచ్చాడో ఏమో ఒక యువకుడు చెట్ల మధ్యనుండి మాకేసి నడిచి వచ్చాడు. మాపక్కన కూర్చుని, ఎంతో కాలంనుంచీ మమ్మల్ని ఎరిగిన వాడల్లే స్నేహంగా మాట్లాడ సాగాడు. మేము మాత్రం అతనితో మాట్లాడలేదు. అతడెవరో



కొత్తవాడు. కొత్తవాళ్లతో వెంటనే దోస్తీ కలిపించుకుని మాట్లాడటం మా కలవాటులేదు. కొత్త బట్టలు, ధగధగ మెరిసేవి, కట్టుకున్నాడు; మంచి అందంగా ఉన్నాడు. ఆ తేజోవంతమైన ముఖం, ఎంత విన్నా వినబుద్ధి వేసే కంఠస్వరం, ఒక రకమైన సౌకుమార్యంతో కూడిన ఠీవి—ఇవన్నీ చూసి అతనితో నేస్తం కలపాలని అనిపించింది. కాని ఎలా మొదలు పెట్టాలో తెలియలేదు. ఇంతలో నాకు పైపుజ్ఞాపకం వచ్చింది. పైపు తీసి ఇద్దామను కున్నాను గాని దగ్గిర నిప్పులేదు గదా అని మళ్లీ జ్ఞాపకం వచ్చి మానేశాను. వెంటనే ఆ అపరిచిత యువకుడు నాకేసి చూసి మందహాసం చేసి,

"నిప్పుకావాలా? దానికేముంది? నిముషంలో తయారు చేస్తాను," అన్నాడు.

పట్టశక్యంకాని ఆశ్చర్యం నన్ను ఉక్కిరిబిక్కిరి చేసింది. నేను ఇంతవరకూ అతనితో ఒక్క మాట మాట్లాడలేదు. పైపు తీసి ఇద్దామని, నిప్పులేకపోతే పైపు మాత్రం ఇవ్వటం దేనికని, ఇదంతా నాలో నేను అనుకున్నానే గాని పైకి అనలేదు. ఇంతలో అతనే నిప్పుకావాలా అని అడగటం ఎంత ఆశ్చర్యకరం! అతడు నా చేతులో పైపు తీసుకుని పొగాకుమీద మెల్లిగా ఊదాడు. వెంటనే పొగాకు అంటుకుంది. నీలపు పొగ సుడిగుండంలో అల్లాగ గిరగిర తిరుగుతూ పైకి లేచింది. ఘక్‌మని ముగ్గరం

లేచి ముందుకు దూకి పరిగెత్త బోయాము. కాని కొత్త యువకుడు పారిపోవద్దనీ, మాకేమీ హాని చెయ్యనని బతిమాల సాగాడు. మాతో చెలిమి చెయ్యటానికే వచ్చాననీ, మేమంటే తనకెంతో ఇష్ట మనీ అన్నాడు. ఆమాటలు విని ఉన్నచోటే ఆగి పోయాము. వెనక్కి వెళ్లటానికి ఒక వంక భయమూ, ఈవింత ఏమిటో పరిశీలించాలని మరొక వంక ఆసక్తి — ఈ రెంటితోనూ ఎటూ కదలలేక నుంచు న్నాము. యువకుడు ఇంకా బతిమాలుతూనే ఉన్నాడు పారిపోవద్దని. పొగాకు అంటుకుని కాలుతున్నప్పటికీ పైపు తాపున బద్దలై పోవటం, భూమి కంపించటం, పిడుగులు పడటం, మొదలైన వేమీ జరగనందున మాకు భయం తీరింది. నెమ్మదిగా కాస్త కాస్త వెనక్కి వచ్చి అతని దగ్గిరే నుంచున్నాము — అవసర మైతే పారిపోటానికి సిద్ధంగా.

మా భయం, అనుమానం తీర్చటానికి అతడు ఎంతో మృదువుగా, మధురంగా కబుర్లు చెప్పాడు. అంత తియ్యటి కంఠం నేనెప్పుడూ వినలేదు. అతని ముఖంలో ఎంతో మంచితనం కనిపించింది. మరి కొద్ది నిమిషాల్లో మేము మాకు తెలియకుండానే అతని పక్కన కూర్చుని నిర్భయంగా మాట్లాడ సాగాము. కొత్త స్నేహితు డొకడు దొరికినందుకు సంతోషం కలిగింది. బెరుకూ, కొత్తా తీరి పూర్వ పరిచితుల మల్లే మాటా మాటా కలిపిన తర్వాత నెమ్మదిగా

అడిగాము: పొగాకుమీద ఊదినంత మాత్రానే నిప్పు ఎల్లా తెప్పించ గలిగావని. అతడు అది కొత్త విద్యేమీ కాదన్నాడు. తనకు స్వతహాగా వచ్చిన విద్యే నన్నాడు. ఇదే కాదు, ఇల్లాంటి వింకా ఎన్నో తమాషాలు తను చెయ్యగల నన్నాడు.

"ఏం తమాషాలు?" అని అడిగాము.

"ఓ, ఏది పడితే అదే చెయ్యగలను. నేను చెయ్యలేనిది లేదు."

"మాకు చేసి చూపిస్తావా?"

"మరి మీరు పారిపోకుండా ఉంటారా?"

"ఊహు. పారిపోము. చెయ్యవూ? తమాషాలు చెయ్యవూ?"

"చేస్తాను. మీరు మళ్ళీ భయపడి పారి పోకుండా ఉంటే ఎన్నైనా చేసి చూపిస్తాను."

మేము పారిపోమని వాగ్దానం చేశాము. యువకుడు కొంచెం దూరంలో ఉన్న నీటిమడుగు వద్దకు వెళ్లి ఒక ఆకు దొన్నెలో నీళ్లు తీసుకు వచ్చాడు. నీళ్ల మీద ఇందాకటిలాగే ఉదాడు. నీళ్లు క్షణంలో గడ్డకట్టి మంచులాగ మారాయి. మాకు అద్భుతమనిపించింది, కాని భయం వెయ్య లేదు. ఇంకా తమాషాలు చెయ్యమని అడిగాము. యువకుడు మమ్మల్ని ఇష్టం వచ్చిన పళ్లు కోరుకో మన్నాడు. ఈకాలంలో కాస్తాయూ కాయువా ఆనే

విచక్షణ లేకుండా ఏం కావలిస్తే అవి కోరుకో మన్నాడు. మేము ముగ్గురం ఒకేసారి అడిగాం.

"బత్తాయి కాయ!"

"ఆపిల్!"

"ద్రాక్షపళ్లు!"

"మీ జేబులో ఉన్నాయి, చూసుకోండి," అన్నాడు యువకుడు. జేబుల్లో చేతులు పెట్టగానే ఎవరు కోరిన పళ్లు వారికి దొరికాయి. అవి తింటే ఎంతో రుచిగా ఉన్నాయి కూడాను. ఇంకా కావా లనిపించింది. కాని మర్యాదగా ఉండదని పైకన లేదు.

"మీకేం కావలిసినా ఇస్తాను. మీరు నాతో ఫలానా ఫలానా ఇది కావాలని చెప్పక్కర్లేదు. మీ పక్కన నే నున్నంత సేపూ మీరు కోరుకోవటం తడవు అన్నీ వచ్చేస్తాయి", అన్నాడు యువకుడు.

రొట్టె, బిస్కట్లు, బిళ్లలు, బాదం కాయలు,— ఏది తలుచుకుంటే అది, ఆక్షణంలో జేబు ఈనినట్టు బయలుదేర సాగాయి. ఆబగా, ఆవురావురుమంటూ వాటిని మేము లగాయించాము. కొత్త యువకుడు మట్టితో చిన్న ఉడత చేసి వదిలిపెట్టాడు. అది పరిగెత్తుకు పోయి చెట్టు కొమ్మమీద కూర్చుని మాకేసి చూసి వెక్కిరించింది. తరవాత ఎలిక పిల్లంత కుక్కనొక దాన్ని చేసి వదిలిపెట్టాడు. అది మొరుగుతూ పోయి చెట్టెక్కి ఉడతను తరిమింది. అలా ఆబుల్లి కుక్క ఉడతని చెట్టుమీంచి చెట్టుమీదికి తరుముకుంటూ

చివరకి రెండూ దూరంగా కనుచూపు మేరదాటి, పోయాయి. తరవాత మట్టితోనే పక్షులు చేశాడు. అవి రెక్కలల్లార్చి పాడుకుంటూ ఎగిరి పోయాయి.

చివరికి ధైర్యం చేసి అడిగాను: నువ్వెవరివో చెప్పమని.

"నేను దేవతని," అన్నాడు యువకుడు, అది చాలా మామూలైన విషయమైనట్టు. అని ఇంకొక పక్షిని నేలమీద పెట్టి, చప్పట్లు కొట్టాడు. అది ఎగిరిపోయింది.

"దేవత" అనగానే ఏదో చెప్పలేని భయం కలిగింది మాకు. కాని భయపడ వద్దనీ, దేవతను చూసి భయపడే అవసరం లేదనీ యువకుడు ధైర్యం చెప్పాడు. మళ్లీ మామూలుగా ఏమీ జరగనట్టు మృదువుగా కబుర్లు చెప్పసాగాడు. చెబుతూనే మట్టితో వేలెడంత మనిషి బొమ్మల్ని బోలెడు చేసి పెట్టాడు. ఆ మనుషుల్లో ఆడవాళ్లూ మొగవాళ్లూ ఉన్నారు. వాళ్లు గబగబ పనులు ప్రారంభించారు. రెండు చదరపు గజాల స్థలం బాగుచేసి దానిమీద ఒక చిన్నకోట కట్టటం మొదలు పెట్టారు. ఆడవాళ్లు సున్నం కలిపి తట్టలతో తీసుకువచ్చి నిచ్చెనల మీద ఉన్న మగవాళ్లకి అందించటం, మగవాళ్లు ఇటుకలు పేర్చి సున్నం మెత్తటం—అచ్చు నిజంగా మనుషులు చేసినట్టే చెయ్య సాగారు. అటువంటి మనుషులు అయిదు వందలమంది అటూ ఇటూ ఏదో గొప్పపని

ఉన్నట్టు తిరగటం, చకచక కోట నిర్మాణం పూర్తి చెయ్యటం చూస్తుంటే భయం, బెరుకూ మరిచిపోయి తన్మయులమై పోయాము. "మేము కూడా అలాంటి మనుషుల్ని చెయ్యవచ్చునా?" అని యువకుణ్ణి అడిగాము. చెయ్యవచ్చన్నాడు. సెప్పీని పేరుపెట్టి పిలిచి కోట గోడలమీద పెట్టటానికి ఫిరంగులు తయారు చెయ్యమన్నాడు. నికొలాస్‌ను పేరుపెట్టి పిలిచి సైనికులకు కవచాలు, శిరస్త్రాణాలు, కత్తులు, డాళ్లు తయారు చెయ్యమన్నాడు. నన్ను గుర్రాల్ని, రౌతుల్ని తయారు చెయ్యమన్నాడు. అతను మమ్మల్ని పేరు పేరునా పిలుస్తుంటే మేం చెప్పకుండా ఎల్లా తెలిసిందా అని మళ్ళీ ఆశ్చర్యం కలిగింది. సెప్పీ ఉండబట్టలేక యువకుణ్ణి "నీ పేరేమి"టని అడిగాడు. "సైతాను," అని సమాధానమిచ్చి అప్పుడే నిచ్చెన ఎక్కుతూ కాలుజారి పడబోతున్న ఒక ఆడమనిషిని పుల్లతో ఆపి సరిగా నుంచోబెట్టాడు "ఈ ఆడమనిషికి ఇంత అజాగ్రత్తేమిటి? కాలుజారి పడితే ఇంకేమన్నా ఉందా?" అన్నాడు.

ఆ పేరు వినగానే మాకు వొళ్లు ఝల్లుమంది. అప్రయత్నంగా మా చేతుల్లోని బొమ్మ ఫిరంగులు, గుర్రాలూ అవీ కిందపడి ముక్కలయ్యాయి. యువకుడు అదిచూసి చిరునవ్వు నవ్వుతూ "ఏమిటలా చూస్తారేం?" అన్నాడు. నేను "అబ్బే ఏం లేదు దేవతలకి అల్లాంటి పేరుంటుందా?" అన్నాను.

"ఎందు కుండ కూడదూ?"

"కాని—ఆ పేరు—అది—దేవుడి విరోధి పేరు గదా?..."

"అవును. అతడు మా బాబయ్య."

ఈమాట మాకెంత ఆశ్చర్యం కలిగించిందో చూడనట్లు నటిస్తూ విరిగిపోయిన గుర్రాల్ని, కవచాల్ని ముట్టుకున్నంత మాత్రాన్నే సరిచేసి మా కందించాడు.

"మీకు గుర్తులేదా? మా బాబయ్య కూడా ఒకప్పుడు దేవతే," అన్నాడు యువకుడు.

"అవును, నిజమే. మరిచిపోయాను," అన్నాడు సెప్పీ.

"దేవుడిపై తిరుగుబాటు చెయ్యకముందు మా బాబయ్య ఒక్క పాపం కూడా చెయ్యలేదు."

"అవును, చెయ్యలేదు," అన్నాడు నికోలాస్

"మాది చాలా మంచివంశం. అంతమంచి వంశం స్వర్గంలో ఇంకోటి లేదు. మాలో కల్లా పాపం చేసింది మా బాబయ్య ఒక్కడే."

సైతానుతో ముఖాముఖి అలా మాట్లాడటం ఎంత ఉత్సాహంగా ఉందో చెప్పలేను. ఏదో వినూతనమైన, సమ్మోహనమైన, అద్భుతమైన విషయం చూస్తుంటే ఒక వంక భయం, మరొక వంక సంతోషం పెనవేసికొని గుండె వేగంగా కొట్టుకోవటం, శ్వాస అంతకంతకు త్వరితము కావటం మీరంతా ఎరుగ

చారు. అలాంటి అవస్థలో నే పడ్డాం మేము. సైతాన్ను ఒక ప్రశ్న అడగాలని పించింది. కాని అడిగితే అవమ ర్యాదగా వుంటుందేమో నని శంకవల్ల ఆగాను. సైతాను తను చేస్తున్న ఎద్దుబొమ్మను కిందపెట్టి నా వంక చూసినవ్వుతూ అన్నాడు:

“అవమర్యాద కాదు. ఒకవేళ అవమర్యాద అయినప్పటికీ అటువంటి వాటిని ఆట్టే పట్టించుకోను. ‘మా బాబయ్యను ఎప్పుడైనా చూశానా’ అని అడగా లను కొంటున్నావు కదూ ? చూడకేం ? కొన్ని లక్షలసార్లు చూశాను. నేను వెయ్యి సంవత్సరాల కుర్రాణ్ణిగా ఉన్నప్పటి నుంచీ ఆయన్నెరుగుదును. మా బాబయ్యకి మా వంశంలో పిల్లలందరిపై కంటే నాపైనే ఎక్కువ ప్రేమ. అప్పటినుంచి, మా బాబయ్య నరకం లోకి పడిపోయేవరకూ, అంటే నాకు ఎనిమిదివేల ఏళ్లు వచ్చేవరకూ నేనంటే ఎంతో ప్రేమగా ఉండేవాడు.”

“ఎనిమిదివేల — ఏళ్లు!” అన్నాం ఒక్క సారిగా.

“అవును... నేను చిన్నవాణ్ణిగా కనిపిస్తున్నానని కదూ మీరు ఆశ్చర్యపోతున్నారు? అవును. నేను చిన్నవాణ్ణే. మీరు కాలం అని పిలిచేదుందే, అది మాకు చాల విశాలమైనది. దేవతలకి వృద్ధాప్యం రావాలంటే చాలా కాలం పడుతుంది...” ఇంతలో నా మనస్సులో ఒక సందేహం మెదిలింది. సైతాను నావంక తిరిగి సమాధాన మిచ్చాడు; “నాకిప్పుడు మీ

కాలమానం ప్రకారం పదహారువేల ఏళ్లు." నికొలాస్ వంక తిరిగి అతని మనసులోని సందేహానికి గావ్రను సమాధాన మిచ్చాడు; "ఊహు. లేదు. దేవుడు మా బాబయ్యని మాత్రమే నరకంలోకి తోసి వేశాడు గాని మావంశంలో ఇతరులకేమీ శిక్ష వెయ్యలేదు. మా బాబయ్య ఒక్కడే పాపం చేశాడు; మొదటి పురుషుడిచేత, మొదటి స్త్రీచేత[5] కూడా పాపం చేయించాడు. మాకు పాపం అంటే ఏమిటో కూడా తెలియదు; - పాపం చెయ్యటం కూడా చేతకాదు; బహుశా ఎప్పుడూ ఇలాగే ఉంటామనుకుంటాను—"

ఇంతలో బ్రహ్మకోట నిర్మిస్తున్న కార్మికుల్లో ఇద్దరు దెబ్బలాడుకోసాగారు. వాళ్ల గొంతుకలు తుమ్మెదలు రొదచేస్తున్నంత హీనస్థాయిలో ఉన్నాయి. ఒకరి నొకరు తిట్టుకున్నారు; తరవాత దెబ్బల్లోకి దిగారు. మెల్లిగా రక్తం కారసాగింది. ఒకరిజుట్టు ఒకళ్లు పట్టుకుని వదలకుండా నేలమీద చాప చుట్టగా దొర్లారు. ఇదంతా చూస్తున్న సైతాను వాళ్లిద్దరినీ చేతుల్లోకి తీసుకుని నల్లుల్ని నలిపినట్టు నలిపి చంపి పారేశాడు. జేబురుమాలు తీసి చేతికంటిన నెత్తురు

(5) సైతాను, అతని పక్షంవారూ స్వర్గంనుంచి నరకానికి బహిష్కరించబడిన తరువాత దేవుడు ప్రపంచాన్ని, అంటే మన భూమిని సృష్టించాడు. భూమికి వెలుగు నిచ్చేందుకు సూర్య, చంద్ర, నక్షత్రాలను సృష్టించాడు. భూమిమీద ఆదిపురుషుడైన ఏడెమ్‌ను, ఆదిస్త్రీ అయిన ఈవ్‌ను, వారితోపాటు సకల చరాచరాలను సృష్టించాడు.

తుమ్ముకుని తన ప్రసంగం కొనసాగించాడు; "ఇందాక ఏం చెబుతున్నాను?—ఆ—మాకు పాపం చెయ్యటం చేతకాదు. పాపమంటే తెలియదు గనక చెయ్యాలనే కోరిక కూడా ఎప్పుడూ కలగదు."

సైతాను మాటలు విచిత్రంగా తోచాయి. అతను చేసిన పనేమిటి? చెబుతున్న మాటలేమిటి? అతని మాటలు అంతకష్టం కలిగించలేదు గాని అతను చేసిన రెండు హత్యలు మాకు దారుణంగా కనిపించాయి. ఇద్దరు మనుషులను, తనకేమీ అపకారం చెయ్యని వారిని, నిష్కారణంగా వధించాడు; అది హత్యకాక మరేమవుతుంది? చాలా బాధపడ్డాము; కొత్త వ్యక్తిమీద మాకు ఇందాక ఎంత గౌరవం కలిగింది! ఎంత ఉదార స్వభావుడని, ఎంత సుందరుడని, ఎంతగొప్ప వాడని అనుకున్నాము! ఇప్పుడదంతా పోయింది! వట్టి పిచ్చాడిలాగ కనిపించాడు.

కాని సైతాను మాత్రం ఏమీ జరగనట్టు తన దోవన తను చెప్పుకు పోతున్నాడు! తన విశ్వ సంచారం, ఏయే లోకాల్లో ఏయే వింతలు చూశాడో, మన భూలోకానికి కోట్ల యోజనాల దూరంలో ఉన్న ఏయే ప్రపంచ మండలాల్లో ఎలాంటి జీవులుంటారో, వారి ఆచార వ్యవహారా లెటువంటివో అన్నీ వర్ణించాడు. వింటుంటే మమ్మల్ని మేము మరిచి పోయాము; అతని వాక్సుధారసం తాగి

తన్మయులమై, మంత్ర ముగ్ధ సర్పాల్లాగ నోరు తెరుచుకు చూస్తూ వుండిపోయాము. మా ఎదురుగా చనిపోయిన ఇద్దరు మనుషుల తాలూకు పిల్లలు భార్యలు భర్తలమీద పడి గొల్లు గొల్లున ఏడుస్తున్నారు. శవాల పక్కన ఒక మతగురువు మోకరించి చనిపోయిన వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తున్నాడు. ఇతరులు చుట్టూ మూగి, టోపీలు తీసి చేత పట్టుకుని కన్నీరు కారుస్తున్నారు — మేము ఇదంతా చూశాము గాని సైతాను అటువైపు చూడనన్నా చూడలేదు. కాని కొంతసేపటికి ఏడుపులు, ప్రార్థనలు ఎక్కువై, ఆరోద అతనికి చిరాకు కలిగించింది. వెంటనే పక్కనున్న ఒక కర్ర తీసుకుని శవాల దగ్గిర మూగిన జనాన్నందరినీ రెండు దెబ్బలతో నేల మట్టం చేసేశాడు. తిరిగి తన సంభాషణ సాగించాడు.

ఆ చంపబడిన జనంలో మతగురువు కూడా ఉన్నాడు! దేవత అయివుండీ మతగురువును చంపేశాడు! ఎంత ఘోరం! తప్పు చెయ్యటమంటే ఏమిటో తెలియదట! చూస్తూ చూస్తూ వందల కొలది అమాయకులను, తన కేమీ అపకారం చెయ్యని వారిని వధించాడు.

కాని క్షణంలో అన్నీ మరచిపోయి అతని మాటలు వినసాగాము. అతని కంఠం వేణు నాదం లాగ మధుర మధురంగా చెవులకు సోకి ఎక్క-

ఉన్నామో, ఏం చేస్తున్నామో తెలియని లోకాల్లోకి తీసుకు పోయింది. ఆకంఠం విని అతనిమీద ప్రాజ్ఞ భావం తప్ప మరొక భావం కలిగించుకో టానికే మాకు సాధ్యం కాలేదు. అమృతంలాగ ప్రవహించే అతని వాక్కులు శ్రవణేంద్రియాలతో తాగుతూ, తన పక్కన మమ్మల్ని కూర్చో నిచ్చినందుకు, తన నేత్రాల స్వర్గంలోకి తేరి పారమూడ నిచ్చినందుకు కృతజ్ఞతతో నిండిపోతూ, అతడు మమ్మల్ని ముట్టుకుంటే చెప్పలేని పారవశ్యం అనుభవిస్తూ, అక్కడే కూర్చుండి పోయాము.

# 3

మా నూత్న మిత్రుడు చూడని సంఘటన లేదు; వెళ్లని స్థలం లేదు; అతనికి తెలియని విషయం లేదు; మరిచిపోయిన విషయం లేదు. మనం కొన్నేళ్లు శ్రమపడితే గాని తెలుసుకోలేని దాన్ని అతడు ఒక్క క్రీగంటి చూపుతో గ్రహిస్తాడు. అతడు ఏదన్నా వర్ణించటం ప్రారంభిస్తే అది సజీవంగా మన కళ్లకి కట్టినట్టుంటుంది. భూమిని దేవుడు సృష్టించటం చూశాట్ట; మొదటి మానవుడైన ఏడం సృష్టిని కూడా చూశాట్ట. శాంసన్ దేవాలయ స్తంభాల్ని ఊడబెరికి దేవాలయాన్ని ధ్వంసం చెయ్యటం చూశాడు. జూలియస్ సీజరు చనిపోవటం చూశాడు. స్వర్గంలో దేవతల దైనిక జీవితం ఎట్లా ఉంటుందో చెప్పాడు. నరకంలోని

అగ్నిసరస్సులో దేవుడి విరోధులు మలమల మాడిపోవటం వర్ణించాడు. వీటన్నిటి గూర్చి చెబుతూ అవి మాకళ్ల ఎదట కనిపించేట్టు చేశాడు. మేము నిజంగా ఆయాస్థలాల్లో ఉన్నంత ప్రత్యక్షంగా అవన్నీ కనిపించాయి. నరకలోకపు అగ్నిసరస్సులో గిలగిల కొట్టుకునే పాపాత్ముల దారుణ బాధచూసి మేము గజగజలాడిపోయాం. కాని సైతాను ఆ దృశ్యం చూస్తూ ఉత్తుత్తి మంటల్లో ఉత్తుత్తి ఎలికలు కాలిపోతున్నంతగా కూడా చలించలేదు.

ఇక భూలోకంలో స్త్రీపురుషులను గూర్చి మాట్లాడుతున్నప్పుడు, వారి పనులను, ఎంత మహోత్తమమైనవాటినైనా సరే, వర్ణిస్తున్నప్పుడు, సైతాను ఇదంతా నిరర్థకమైన బొమ్మలాటగా పరిగణిస్తున్నట్టు మాట్లాడాడు. అతడు మనుష్యుల్ని గూర్చి మాట్లాడుతున్నా, ఈగల్ని గూర్చి, దోమల్ని గూర్చి మాట్లాడుతున్నట్టు అనిపించింది. ఆమాట స్పష్టంగా చెప్పేశాడు కూడా: మానవులు వట్టి దౌర్భాగ్యులు, అజ్ఞానులు, గర్వపోతులు, శుష్కదంభగాళ్లు, రోగిష్ఠులు, బలహీనులు, ఎందుకూ పనికిరాని చెత్తరకంగాళ్లు. అయినప్పటికీ వాళ్లని చూస్తుంటే తనకేదో తమాషాగానే ఉంటుందని మెచ్చుకున్నాడు. మానవులను ఇన్ని బండబూతులు తిట్టినా, ఆ తిట్టడంలో ఎక్కడా అతని ద్వేషం వ్యక్తం కాలేదు. మామూలుగా అన్నట్టే అన్నాడు. పెంట

పోగును చూసి మనం దూరంగా తొలగిపోయి నప్పుడు దానిమీద మనకి వ్యక్తిగతంగా కోపం వుంటుందా? ఉండదు. అట్లాగే మానవులంటే అతనికీ కోపం లేదు. మనని తిట్టాలని తిట్టకపోయినప్పటికీ అదేమంత పెద్దమనిషితరహాగా లేదని మనసులో అనుకున్నాను.

"పెద్దమనిషితరహా కాదూ? నేనన్నది అక్షరాలా నిజం. నిజం చెప్పటంకంటే పెద్దమనిషితరహా ఏముంది?... ఆ, ఇదుగో, కోట తయారైంది. బావుందా?" అన్నాడు సైతాను.

నిజానికి బొమ్మకోట చాలా బావుంది. కందకం, ప్రహారీగోడ, బురుజులు, రెపరెపలాడే చిన్న జెండాలు—పరిమాణంలో చిన్నదైనా నిజమైన కోట అంత సర్వాంగ సుందరంగా ఉంది. సైతాను బురుజుల మీదకి ఫిరంగుల నెక్కించమనీ, సైనికులను బారుగా నుంచోపెట్టమనీ, ఆశ్వికదళాన్ని సమాయత్తపరచమనీ మాకు ఆదేశించాడు. మేము తయారుచేసిన మనుషులను, గుర్రాల్ని చూస్తే మాకే నవ్వొచ్చింది. సైతాను వాటిని ముట్టుకుని ప్రాణం తెప్పించాడు. మాకు బొమ్మలు చెయ్యటం తిన్నగా చేతకాలేదు. మనుషులకి, గుర్రాలికి కాళ్లు వంకరటింకరగా ఉన్నాయి; ఒకకాలు పొట్టి, ఒకకాలు పొడుగుగా తయారయ్యాయి. మనుషులు వంకరటింకరగా నడుస్తుంటే తాగినవాళ్లు తూలుతూ నడుస్తున్నట్టుంది

పైగా నడవటం కుదరక అడుగడుక్కీ కూలబడి కాళ్లు చేతులు విరగ్గొట్టుకున్నారు. చివరికి ఒకరి నొకరు తోసుకుని అంతా కూలబడి లేవలేక తన్నుకో సాగారు. తోటి మానవులు అలా బాధపడుతుంటే మాకు సిగ్గు వేసినా, మరొకవంక ఆపుకోలేని నవ్వు కూడా వచ్చింది. ఇక మేము చేసిన ఫిరంగు లున్నాయి—వాటిని ఫిరంగు లనటానికే వీలులేదు. వాటిలో మందు కూరి పేల్చేసరికి అవి వంకరగా ఉన్నందున ఒక్కసారిగా అన్నీ ముక్కలు ముక్కలుగా బద్దలై పోయాయి. ఆ ప్రేలుడుకు చుట్టుప్రక్కల ఉన్న ఫిరంగిసైనికులు కొందరు మరణించారు; కొందరు గాయపడ్డారు.

తరవాత సైతాను కోటఉన్న ప్రదేశానికి గాలివాన తెప్పిస్తా నన్నాడు. కావలిస్తే భూకంపం కూడా తెప్పిస్తా నన్నాడు; ప్రమాదం రాకుండా మమ్మల్ని దూరంగా నుంచోమన్నాడు. మనుషుల్ని కూడా ఇవతలకు పిలుద్దామనుకున్నాము గాని సైతాను వద్దన్నాడు. కావలిస్తే మళ్లీ ఆ మనుషుల్ని తయారు చేసుకోవచ్చనీ, వీళ్లు నశించినంత మాత్రాన నష్టమేమీ లేదనీ అన్నాడు. ఇంతలో కోటశిఖరాల మీదుగా నల్లటి మబ్బులు వ్యాపించి ఆ ప్రదేశమంతా చీకటి చేశాయి. చిన్న చిన్న మెరుపులు మెరిశాయి; బుల్లి బుల్లి పిడుగులు పడ్డాయి; గాలి హోరున వీచింది; భూమి కంపించింది; వాన ప్రారంభమైంది;



జనమంతా రక్షణ కోసం కోటలోకి చొరబడ్డారు. మబ్బులు అంతకంతకు చిక్కనై, నల్లనై కోటను

పూర్తిగా మూసివేశాయి. మెరుపులు తీగెలు తీగెలుగా కోటను ముట్టడించాయి. కోట భగ్గుమని అంటుకుంది. వెయ్యి నాల్కల పాము లాగ అగ్ని దేవుడు బుసలు కొట్టాడు; జ్వాలా తరంగాలమీద నాట్యం చేశాడు. కోటలో దాక్కున్న మనుషులు హృదయ భేదక ధ్వనులు చేస్తూ మళ్ళీ బయటికి పారిపోయి వచ్చారు. సైతాను మళ్ళీ వాళ్లని కోటలోకే తోసివేశాడు; వారి దురవస్థ చూసి మాకు కూడా ఏడుపొచ్చింది. వద్దని ఎంత బతిమాలుతున్నా సైతాను వారిని మంట ల్లోకే తోశాడు. కోటలో ఉన్న మందుగుండు సామాను అంటుకుని ఢామ్మని ధ్వనించింది. అక్రేలు డుకు భూమి బద్దలైంది. కోట, అందులో వున్న పంచ లాది అనాయక ప్రాణులు భూగహ్వరంలోకి పడి పోయి, క్షణంలో అంతా అదృశ్యమై పోయింది. ఒక్క మనిషి కూడా మిగల్లేదు. భూమి ఏమీ ఎరగ నట్టు తిరిగి మూసుకుంది. ఆ దృశ్యం చూసి మా గుండెలు బద్దలై పోయాయి. ఏడవకుండా ఊరుకోలేక పోయాము.

"ఎందుకేడుస్తారు? ఇంకా ఇలాంటి వాళ్లని ఎంత మందిని కావలిస్తే అంతమందిని తయారు చేసుకోవచ్చు," అన్నాడు సైతాను నిర్దయగా నవ్వుతూ.

సైతాను హృదయకాఠిన్యాన్ని కరిగించాలను కోవడం కంటె నిరర్థక ప్రయాస ఇంకో టుండదు.

అతనిలో మనుష్యత్వం బొత్తిగా లేదు; అతనికి మానవ హృదయం అర్థం కానే కాదు. తన ఎదుట జరిగిన పైశాచిక హత్యాకాండ చూసి పెళ్లి వేడుక చూస్తున్నట్టు ఆనందించాడు. తన ఆనందాన్ని మేము కూడా పంచుకునేలాగ చేయాలని ప్రయత్నించాడు. మమ్మల్ని మరిపించటం అతనికేమీ కష్టమైన పని కాదు. జేబులోంచి ఏదో చిత్రమైన వాద్యం తీసి వాయించాడు. అది సంగీతమేనా? ఏమో చెప్పలేము. అంత విచిత్రమైన, వినూత్నమైన మధుర శబ్దాలు మేము ఎప్పుడూ ఎక్కడా వినలేదు. బహుశా అది స్వర్గలోకపు సంగీతమై ఉండి ఉండచ్చు. అప్రునని సైతాను సమాధాన మిచ్చాడు. క్షణం లో గత సంఘటన లన్నీ మరిచిపోయి, అప్రయత్నంగా లేచి నిలబడి నాట్యం చెయ్యసాగాము. ఆనాట్యం ఎలా చేశానిందో మాకే తెలియదు. ఆనాట్యం కూడా స్వర్గ లోకపు నాట్యమే నన్నాడు సైతాను. వాద్యం వాయిస్తున్నంత సేపు అతని కళ్లనుంచి మాకళ్లు తిప్పుకోలేక పోయాము. మా చూపులు హృదయాల్ని చీల్చుకుని వచ్చినట్టు తోచింది. వాటిలో అతని పై భక్తి తప్ప మరొక భావమే లేదు.

సంగీతం ఆగింది. నెమ్మదిగా మా నాట్యం కూడా ఆగింది. కలలోంచి మేలుకున్నట్టు జాగరితుల మయ్యాము. సైతాను తనకు వేరేచోట పనివుంది, వెళ్లిపోవా లన్నాడు. అతడు వెళ్లిపోతే మేము

భరించలేమన్నాము. అతని చేతులు పట్టుకుని దీనంగా బతిమాలుకున్నాము వెళ్లవద్దని. సైతాను మా ప్రార్థన మన్నించాడు. మేము బతిమాలటం తనకు సంతోషం కలిగించిందన్నాడు. ఇంకా కొంచెం సేపు మాత్రమే మాతో ఉంటానన్నాడు. తన అసలు పేరు సైతాను అయినా, ఆ పేరు మా ముగ్గురికీ తప్ప ఇంకెవరికీ తెలియకూడదనీ, ఇతరులున్నప్పుడు తన్ను ఇంకో పేరుతో పిలవాలనీ చెప్పాడు. ఫిలిప్ ట్రామ్ అని పిలవమన్నాడు.

సైతాను లాంటి అద్భుత వ్యక్తికి ఫిలిప్ ట్రామ్ అనే మామూలు పేరు తగదనిపించింది. కాని సైతాను ఒక నిర్ణయం చేశాక దానికి తిరుగేముంది!

ఇవ్వాళ మేము ఎన్నో విచిత్రాలు చూశాము. ఊళ్లోకి వెళ్లాక మాతోటి పిల్లలతో ఇదంతా చెబితే ఎంత గొప్పగా ఉంటుందో అనుకున్నాము. కాని మా ఆలోచనలు గ్రహించాడు సైతాను.

"వద్దు వద్దు; ఈవేళ జరిగిన విచిత్రాలు మన నలుగురిలోనే అణగి పోవాలి. ఒక్క పిసరు కూడా బైటికి పొక్క గూడదు. మీకు బాల్య చాపల్యం చేత ఒకవేళ ఎవరితోనన్నా చెప్పాలనుకున్నా చెప్పలేరు. చెప్పాలనుకున్నప్పుడల్లా వాగ్బంధం చేసి ఉంచుతాను," అని హెచ్చరించాడు.

ఇదంతా రహస్యంగా ఉంచాలనే సరికి మాకు ఆశాభంగం అయింది. కాని చేసేదిలేక నిట్టూర్పు

విడిచి ఉంటున్నాము. మళ్ళీ కబుర్లలో పడ్డాము. సైతాను మా మనస్సులో మెదిలే ఆలోచనల కెప్పటి కప్పుడు సమాధానా లిచ్చాడు. ఇలాగ ఇతరుల ఆలోచనలను కనిపెట్టటం అన్ని చిత్రాల కంటే చిత్రంగా ఉందనుకున్నాను. కాని సైతాను సమాధాన మిచ్చాడు:

"మీకైతే చిత్రంగా ఉండచ్చుగాని నాకది చిత్రమేమీ కాదు. మీకు మల్లే నేను పరిమిత జీవిని కాను. మీ మానవ లక్షణాలకి నేను అతీతుణ్ణి. మానవుల దౌర్బల్యాన్ని నేను తరిచి తరిచి పరిశోధించాను. కాని ఆ దౌర్బల్యం నన్నంటదు. మీరు నన్ను ముట్టుకుంటే మనుష్య శరీరం ఉన్నట్టే ఉంటుంది; కాని నాకు శరీరం లేదు; నాబట్టలు నిజమైన బట్టలు కావు. నేను అశరీరిని...అదుగో ఫాదర్ పీటర్ వస్తున్నాడు."

మేము చుట్టూ చూశాము. ఎవరూ కనబడ లేదు. "మీకత డిప్పుడప్పుడే కనిపించడు. మీ కంటికి అందని దూరంలో ఉన్నాడు," అని సైతాన్ అన్నాడు.

"ఫాదర్ పీటర్ని నువ్వెరు గుదువా?" అని అడిగాము.

"ఉహుఁ."

"ఆయనిక్కడికి వస్తే ఆయనతో మాట్లాడతావా? ఆయన మాకు మల్లే ఏమీం తెలుసుకోని అజ్ఞానుడు కాదు. మాట్లాడతావా?"

"ఇప్పుడు కాదు. ఇంకోసారి ఎప్పుడైనా మాట్లాడతాను. నాకు వేరే తొందరపని వుంది. ఆ, అదుగో. ఇప్పుడు చూడచ్చు మీరు. సద్దు చెయ్యకుండా కూచోండి. మాట్లాడకండి."

ఫాదర్ పీటర్ దూరంగా చెట్లమధ్య నుంచీ మా కేసే వస్తున్నాడు. మేము ముగ్గురం దోవపక్కగా పెరిగిన పచ్చికలో కూర్చున్నాం. సైతాను దోవ మధ్యగా కూర్చున్నాడు. ఫాదర్ పీటర్ తలవంచుకుని, తీక్ష్ణంగా ఆలోచిస్తూ, వచ్చి వచ్చి, మాకు రెండు గజాల దూరంలో ఆగాడు. ఆగి, టోపీతీసి, చేతిరుమాలతో మొహం తుడుచుకుంటూ మాతో మాట్లాడబోతున్నట్టు చూశాడు. కాని మాట్లాడలేదు. "ఇక్కడికెల్లా వచ్చాను? ఇంతకు ముందే గదా నాగదిలో కూర్చుని చదువుకుంటున్నాను? నన్నిక్కడికెవరో లాక్కొచ్చినట్టు కనిపిస్తుంది. లేకపోతే నా అంతట నేనే ఇంతదూరము నడిచి వచ్చానేమో? అంతా గందరగోళంగా వుంది. ఈమధ్య మనస్సు మనస్సులో వుండటంలేదు," అని తనలో తను గొణుక్కున్నాడు. తరవాత ముందుకు నడిచాడు. సైతాను అక్కడ కూర్చున్నది కూడా చూసుకోకుండా సూటిగా అతనిగుండా నడిచాడు.

మాకు చెప్పరాని ఆశ్చర్యం వేసింది. భయభ్రాంతులమై కెవ్వుమని కేక వెయ్యబోయాము కాని ఏదో మంత్రశక్తి వల్ల మానోళ్లు తెరిచినవి తెరిచినట్టే ఉండి పోయాయి. ఫాదర్ పీటర్ అలా చెట్లచాటుకు నడిచిపోయి ఇక కనిపించలేదు. సైతాను ఇలా అన్నాడు:

"చెప్పానా, లేదా? నేను అశరీరినని."

"అవును, నువ్వు అశరీరివే," అన్నాడు నికొలాస్; "కాని మేము అశరీరులం కాదే. నిన్ను ఫాదర్ పీటర్ చూడనట్టు తెలుస్తూనే వుంది. కాని మమ్మల్ని కూడా చూడకుండా ముందుకు వెళ్లిపోయాడు. మాకేసి చూస్తూ కూడా మేమిక్కడున్నట్టు గ్రహించలేదు. మేము కూడా నీలాగే అదృశ్యులమై ఉన్నామా?"

"అవును. మనమెవ్వరం అతనికి కనిపించలేదు. కనిపించకూడదని నేను అనుకున్నాను; అల్లాగే జరిగింది."

అతడు చెప్పింది ఒక పట్టాన నమ్మ శక్యం కాలేదు. ఎప్పుడో జరిగాయని కథలుగా చెప్పుకునే అద్భుత విచిత్రాలన్నీ మా విషయంలోనే జరుగుతున్నాయంటే, ఇదంతా కలా, నిజమా అనిపించింది. కల అని ఎలా అనుకోగలం? నిజమైన మనిషి లాగానే మా ఎదురుగా కూర్చుని, నవ్వుతూ, నవ్విస్తూ, చలాసాగా కబుర్లు చెబుతున్నాడు సైతాను. అప్పటి మా

మనస్థితి వర్ణించటం నాతరంకాదు. తన్మయత్వం అంటే సరిపోతుందేమో ! కాని తన్మయ స్థితిని మాటల్లో వర్ణించటమెల్లా? తన్మయత్వం అనేది సంగీతం లాంటిది. సంగీతం ఈమాదిరిగా ఉంటుందని మరొక మనిషికి వర్ణించటమెల్లా?

సైతాను తిరిగి ప్రాచీన యుగాల కథలు చెప్ప సాగాడు. అబ్బ! అతనికి తెలియనిది, అతడు చూడనిది లేదు ! అతడు చెప్పేవి వింటూ, అతనికేసి చూస్తూ, అంత విస్తారమైన విజ్ఞానం, అంత అనంతమైన అనుభవం సంపాయించిన వాడి మనస్సు ఎలా ఉంటుందా అని ఆలోచించ సాగాము. అతనితో మమ్మల్ని పోల్చుకుంటే, పోలికకైనా సరిపోని క్షుద్ర కీటకాలమనిపించింది. సైతాను మాట్లాడటంలో కూడా అతని దృష్టికి మానవులు పెంట కుప్పలవంటి వారేనన్న ధోరణి తప్ప మరొకటి వ్యక్తం కావటం లేదు. అయితే మానవులను అవమానించాలనే ఉద్దేశ్యం అతనిలో ఎక్కడా కనిపించలేదు. పెంటకుప్పను తీసి అవతల పారవేసి నప్పుడు దాన్ని అవమానిస్తున్నామనే భావం మనకుంటుందా? ఉండదు. అలా పారవేయటం వల్ల పెంటకుప్ప ఎంత బాధ పడుతోందో, ఎంత వ్యాకుల పడుతోందో అనే ఆలోచనే మనకి రాదు. అసలది బాధ పడగలదో లేదో అనే ఆలోచన కూడా రాదు.

వేక సహించలేక ధైర్యంచేసి సైతాన్ని అడిగాను, "మనుష్యులంటే నీకింత నిరసన భావం ఎందుకూ? నీకూ మాకూ తేడా ఏమిటి?" అని. నా ప్రశ్న విని నివ్వెరపోయాడు; ఏమనుకున్నాడో కూడా అతనికి కొంతసేపటి వరకూ అర్థం కాలేదు. చివరికి ఇలాగన్నాడు:

"నాకూ మనిషికీ తేడా ఏమిటా? మర్త్యునికీ అమర్త్యునికీ తేడా ఏమిటా? మేఘానికీ, ఆత్మ పదార్థానికీ తేడా అడుగుతున్నావా?" అని పక్కనే పాకుతున్న పురుగునొక దాన్ని పట్టుకుని "దీనికీ సీజరుకీ తేడా ఏమిటి?" అని అడిగాడు.

"ఈ పురుగునూ సీజరునూ పోల్చటం న్యాయం కాదు. సీజరు తత్వానికీ, ఈపురుగు తత్వానికీ, సీజరు జీవించిన కాలానికీ, ఈ పురుగు జీవించే కాలానికీ ఎంతో అంతరం ఉన్నది," అన్నాను నేను.

"అవును నీ ప్రశ్నకు నువ్వే సమాధానం చెప్పుకున్నావు. దాన్ని నేను విడమర్చి చెబుతా నాగు. మానవుని సృష్టిని నేను కళ్లారా చూశాను. మానవుడు మట్టితో సృష్టించబడ్డాడు. నేను మట్టితో సృష్టి కాలేదు. మానవుడు చిత్ర విచిత్ర రోగాల మ్యూజియం లాంటి వాడు; అనుచికి నిలయమైన వాడు. మానవుడు ఇవ్వాళ వస్తాడు; రేపు పోతాడు. బురదగా ప్రారంభమై దుర్గంధంగా నిష్క్రమిస్తాడు. నేను అమరుల కోవకు చెందినవాణ్ణి. నాకూ మాన

వుడికీ ఇంకొక పెద్ద భేదం ఏమిటో తెలుసా? మానవునికి ధర్మాధర్మ విచక్షణ జ్ఞానం ఉన్నది. నాకు లేదు. తెలిసిందా?"

సైతాను మాట్లాడకుండా ఆలోచనలో పడ్డాడు. ధర్మాధర్మ విచక్షణ జ్ఞానమంటే నాకు బాగా తెలియదు; చూచాయగా మాత్రమే ఆమాట అర్థం తెలుసు. కాని అదేదో గొప్పదనీ, ఆ విచక్షణ శక్తి మానవునికి ఉండటం గర్వించ దగిన దని మాత్రం నాకు నిశ్చయంగా తెలుసు అటువంటి దాన్ని పట్టుకుని సైతాను నిర్లక్ష్యం చెయ్యడం నాకు చాలా కష్టం కలిగించింది. క్షణం సేపు అందరం మౌనంగా కూర్చున్నాము. తరవాత సైతాను మళ్ళీ కబుర్లు ప్రారంభించాడు. మానిరుత్సాహం పోగొట్ట డానికై హాస్య కథలు చెప్పి ఉషారు చేశాడు. చివరికి లేచి నిలబడ్డాడు.

"ఇక నేను వెళ్ళిపోవాలి. పనుంది."

"వద్దు వద్దు. అప్పుడే వెళ్ళవద్దు. ఇంకా కాసేపు కూర్చో. ఇక మళ్ళీ రావు నువ్వు," అని ముగ్గురం ఒక్కసారిగా అన్నాం.

"ఉహు. వెళ్ళాలి. మళ్ళీ వస్తాను. తప్పకుండా వస్తాను."

"ఎప్పుడూ? ఇవ్వాళ రాత్రికా? చెప్పు ఎప్పుడొస్తావో?"

"త్వరలోనే. మీరే చూస్తారుగా."

"నువ్వంటే మాకెంతో ఇష్టం. నువ్వు రాక పోతే ఎంత బాధ పడతామో తెలుసా?"

"అవును. మీరంటే నాకు కూడా ఇష్టం ఏర్పడింది. అందుకే మీకోసం ఒక తమాషా చేసి చూపిస్తాను. సాధారణంగా నేను నిష్క్రమించే టప్పుడు హఠాత్తుగా అంతర్ధానమై పోతాను. ఇప్పుడు మెల్లి మెల్లిగా హరించి పోతాను."

అంటూండగానే సైతాను క్రమంగా హరించి పోసాగాడు. చివరికి సబ్బు బుడగ అంత పరిమాణా నికి వచ్చాడు. కాని కాళ్ళు, చేతులు, ముఖం ఈ ఆకారమంతా యథారూపంలోనే ఉంది. సబ్బు బుడగ లోంచి అవతలి వస్తువులు కనిపించినట్టే అతనిలోంచి అవతలి పొదలు, పచ్చిక అన్నీ కనిపిస్తున్నాయి. సబ్బు బుడగ మీద సూర్యరశ్మి పడి ఇంద్ర ధనస్సు రంగులు వచ్చినట్లే అతను కూడా చిత్ర చిత్ర వర్ణాలతో ప్రకాశించాడు. సబ్బు బుడగను ఊది నప్పుడు మెల్లిగా ఎగురుతూ పోయి నేలమీద పడి రెండు గెంతులు వేసి టక్కుమని బద్దలవుతుంది. అలానే సైతాను కూడా సబ్బు బుడగంత తేలికై పోయి కొంత దూరం ఎగిరి పోసాగాడు. తరవాత పచ్చిక మీదికి దిగాడు. మళ్ళీ ఎగిరి మరి కొంత దూరంలో వాలాడు. అలా చాలదూరం పోయిపోయి బద్దలై మాయ మయ్యాడు. అతను ఇందాక ఉన్నస్థలంలో శూన్యం మిగిలింది.

ఈ దృశ్యం పరమాద్భుతంగా ఉంది. ఏదో ఇంద్రజాలం చూస్తున్నట్లు ఊపిరి బిగపట్టి చూశాం. సైతాను మాయనైన కొంతసేపటికి క్రమంగా నిట్టూర్పులు విడిచాం. చివరికి సెర్గీ లేచి నుంచుని,

"అసలిదేమీ జరగలేదనుకుంటాను,"
అన్నాడు.

"అవును. ఇదంతా మాయ," అన్నాడు నికొలాస్.

నాకూ అలాగే అనిపించింది. కాని మాట్లాడకుండా, స్తబ్ధుగా కూర్చుండిపోయాను.

ఇంతలో ఫాదర్ పీటర్ వెళ్లిన దారినే తిరిగి వస్తూ కనిపించాడు. తలవంచుకుని నేలమీద ఏదో వెదుకుతున్నాడు. మాకు బాగా దగ్గిరగా వచ్చిన తరవాత తలఎత్తి మమ్మల్ని చూసి,

"ఇక్కడ ఎంతసేపటినించీ ఉన్నారా?" అని అడిగాడు.

"ఆట్టేసేపు కాలేదు ఫాదర్!"

"అలాగా. ఈ దోవనే వచ్చారా?"

"అవును ఫాదర్!"

"అలాగా. నేనూ ఈ దోవనే వచ్చాను. నా చేతిసంచీ దోవలో ఎక్కడో పారేసుకున్నాను. దాంట్లో డబ్బుకూడా వుంది. కాస్తే ననుకోండి. ఐనా నాకున్నదంతా ఆ కాస్తే. మీ కెక్కడనా నా సంచీ కనిపించిందా?"

"చూడలేదు ఫాదర్. వెదకితే కనిపిస్తుందేమో."

"అయితే వెదకండి...అరె. ఇదుగో ఇక్కడే వుంది!"

అంతవరకూ అది అక్కడ ఉండటం మేము చూడనేలేదు. సరిగ్గా సైతాను ఇందాక కూర్చున్న చోటనే (సైతాను రావటం, కూర్చోటం నిజమేఅయిన పక్షంలో) చేతిసంచీ వున్నది. ఫాదర్ పీటర్ సంచీ తీసుకున్నాడు. వెంటనే తెల్లబోతూ చూశాడు.

"ఈ సంచీ నాదే. కాని ఇది చాలా బరువుగా వుంది," అంటూ సంచీ తెరిచిచూశాడు. సంచీనిండా బంగారునాణాలున్నాయి. నాణాలు చూడగానే మేము ముగ్గురం ఒక్కసారిగా నోళ్లు తెరిచి "సైతాను పనే!" అనబోయాము. కాని తెరిచిన నోళ్లు తెరిచినట్టే ఉండిపోయాయి; మాట బైటికి రాలేదు. అది సైతాను మహిమయేనని వెంటనే గ్రహించాము.

"నాసంచీలోకి ఇన్ని నాణాలు ఎలా వచ్చాయి? మీ పనేనా యిది?" అన్నాడు ఫాదర్ పీటర్.

ఈ [illegible] పగలబడి నవ్వాము. ఇంత తెలివితక్కువ ప్రశ్న వేసినందుకు ఫాదర్ పీటర్కు కూడా నవ్వొచ్చింది.

"ఇక్కడికి ఇంకెవరన్నా వచ్చారా?" అని ఆయన అడిగాడు.

మేము సమాధానం ఇవ్వటానికి నోళ్లు తెరిచాము. 'ఎవరూ రాలేదు' అంటే అబద్ధమవుతుంది; 'సైతాను' అందామంటె ఆ మాట పైకి రావటం లేదు. చివరికి "మనుష్యమాత్రు డెవడూ రాలేదు," అని సమాధానం ఇచ్చాము.

"కాదు. ఎవరో వచ్చారు. నే నిందాక ఈ దోవనే ఇటు వెళ్లాను. అప్పు డిక్కడ ఎవరూ లేరు. ఆతరవాత ఎవరో వచ్చివుండాలి. బహుశా మీకా మనిషి కనిపించలేదేమో. నిజంగా చెప్పండి—మీకెవరూ కనిపించలేదా ఇక్కడ?"

"మాకే మనిషీ కనిపించలేదు ఫాదర్!" అన్నాము.

"చాలా విచిత్రంగా వుంది," అని గొణుక్కుంటూ ఫాదర్ పీటర్ సంచీలో నాణాలు తీసి లెక్కించసాగాడు. మేము ఆయన లెక్క పెట్టినవాటిని తీసి వరసగా పేరుస్తున్నాము.

"అబ్బ! పదకొండు వందల డకట్లు* పై చిల్లర. ఇదంతా నాదైతే, ఎంత బావుంటుంది!" అన్నాడు ఫాదర్ పీటర్.

"అది సరే ఫాదర్!" అన్నాము.

"కాదు. ఇదంతా నాది కాదు. ఇందులో నాలుగు డకట్లు మాత్రమే నావి. మిగతావి......"

---

* డకట్:—పూర్వం యూరపియన్ దేశాల్లో వాడుకలో ఉండే బంగారు నాణెం.

అంటూనే ఆ వృద్ధుడు బంగారు నాణాలు గుప్పిళ్ళతో తీసి వదిలిపెడుతూ తియ్యటి ఆలోచనల్లో పడ్డాడు.



ఆయన్ని చూస్తుంటే జాలివేసింది. కొంతసేపటికి ఆయన అదిరిపడినట్టు వెక్కి తొలగి, "కాదు. ఇది నాది కాదు. నాచేత నేరం చేయించటానికి ఎవరో విరోధి ఈ వల పన్నాడు...అవును..." అన్నాడు.

నికొలాస్ అందుకుని "కాదు, ఫాదర్. ఇది నీదే. మన వూళ్లో జ్యోతిష్కుడు తప్ప నీకు నిజంగా విరోధు లెవరూ లేరు. మార్గెట్ కి కూడా ఎవరూ శత్రువులు లేరు. నిన్ను మోసం చెయ్యాలని పదకొండు వందల డకట్లు ఇక్కడ పడవేసే విరోధి అసలు లేడు," అన్నాడు.

నికొలాస్ అన్న మాట ఫాదర్ పీటర్ కాదన లేకపోయాడు. ముఖం కొంచెం వికసించింది. "నువ్వు చెప్పింది నిజమే నికొలాస్! కాని ఈ డబ్బు నాది కాదు. ఇంత డబ్బు నాదెల్లా అవుతుంది?" అన్నాడు.

అలాగని ఆయన అన్నాడు కాని "ఇది నీదే" నని మాచేత ఇంకా కాసేపు బతిమాలించుకోవాలని అలా అంటున్నట్టు తెలుస్తూనే వుంది.

"ఫాదర్! నువ్వు సందేహించకు. ఈ డబ్బు నిజంగా నీదే, కావలిస్తే మేము సాక్ష్యం ఉంటాం", అన్నాను నేను.

మిగతా ఇద్దరూ నా మాట సమర్థించారు.

"అబ్బాయిలూ! మీరు నన్ను మరీ బలవంతం చేస్తున్నారు. ఈ డబ్బులో ఒక్క నూరు నాణాలు నావైతే ఎంత బావుండును? మా ఇల్లు నూరు డకట్లకు

తాకట్టు పెట్టాము. గేథ గనక తాకట్టు విడిపించుకోక పోతే ఇక మాకు నివటానికి నీడ ఉండదు. మరి నాకున్నదంతా కలిపి నాలుగు డకట్లైనయ్యే!"

"మళ్ళీ అలా అంటావేమి ఫాదర్! ఇందులో ప్రతిఒక్క డకట్ నీదే. తప్పకుండా తీసుకోవాలి. తప్పదు. నువ్వు అన్యాయంగా సంపాదించింది కాదని మేము సాక్ష్యం ఉంటాము. కదురా సెప్పీ? ఏమంటావ్ థియొడోర్?" అన్నాడు. నికొలాస్.

"ఓ" అని మేమిద్దరం తలకాయలూపాము. నికొలాస్ డబ్బంతా పోగుచేసి మాసిపోయిన సంచీలో పోశాడు. ఫాదర్ పీటర్ తన ఇంటి తాకట్టు ఇవ్వాళే విడిపించివేస్తాననీ, మిగతా డబ్బు వడ్డీకి వేస్తాననీ, ఆ డబ్బు ఎవరిదో ఆ మనిషి కనిపించినప్పుడు అతని డబ్బు అతనికే ఇచ్చివేస్తాననీ అన్నాడు. మమ్మల్ని ఆ డబ్బు తనకెలా వచ్చిందో ఆ వైనమంతా ఒక కాగితంమీద రాసి సాక్షి సంతకాలు పెట్టమన్నాడు.

## 4

ఫాదర్ పీటర్ ఒక్కసారిగా ధనవంతుడు కావడం ఊళ్ళో పెద్దసంచలనానికి కారణమైంది. సాలమన్ ఐజాక్స్‌కి డబ్బిచ్చి ఇల్లు విడిపించుకున్నాడు; మిగతాది అతనివద్దనే వడ్డీకి వేశాడు. భాగ్యశాలి కావడంతో ఇప్పటిదాకా దూరదూరంగా ఉంటున్న పాత స్నేహితులు, బంధువులు వచ్చి పలకరించారు; ధన

వంతుడైనందుకు అభినందించారు. అక్కడితో ఆగక, మార్గరెట్‌ను విందుకు, నృత్యానికి ఆహ్వానించారు.

ఫాదర్ పీటర్ ఏమీ దాచకుండా ఉన్నదున్నట్టు చెప్పేశాడు. ఏ పరిస్థితుల్లో, ఎప్పుడు, ఎక్కడ డబ్బు దొరికిందో వివరంగా, సమగ్రంగా చెప్పాడు. ఆ డబ్బు అక్కడి కెలా వచ్చిందో తనకి తెలియదనీ, అదంతా దేవుడి చలవేననీ అన్నాడు.

ఒకళ్లిద్దరు పెదవులు విరిచారు. "దేవుడి చలవ కాదు, సైతాన్ చలవలాగా కనపిస్తోం" దని చాటుగా అనుకున్నారు. కొందరు మా ముగ్గుర్ని అవతలకు తీసుకుపోయి "నిజం" చెప్పమని ఒత్తిడి చేశారు. ఇంకెవ్వరికీ చెప్పమనీ, తమాషాగా ఉందిగనక అసలు విషయం ఏమిటో తెలుసుకోవాలని అడుగుతున్నామనీ అన్నారు. ఒట్లేసుకున్నారు; వారిలో కొందరు లంచం ఇస్తామనికూడా అన్నారు. ఏదన్నా కల్పించి చెబితే, డబ్బయినా వస్తుందని ఆశపడ్డాం. కాని సమయానికేమీ తోచలేదు. అందుచేత లంచం కొట్టే అవకాశం జారిపోయింది.

డబ్బును గురించిన రహస్యం మా ముగ్గురికీ తప్ప ఎవరికీ తెలియదు. ఈ రహస్యం దాచటంలో మేము అట్టే కష్టపడలేదు. కాని ఆ అసలు రహస్యం, ఇంతకంటె పెద్దది, గొప్పది, అద్భుతమైనది అయిన, అసలు రహస్యంమటుకు మమ్మల్ని నిలువునా దహించసాగింది. చెబుదా మనుకున్నప్పటికీ ఆ రహస్యం

బైటికి రావటంలేదు. చెప్పటానికి వీల్లేకుండా వాగ్బంధం చేస్తానన్నాడు సైతాను. అతడన్నట్టే ఆ రహస్యం చెబుదామనుకున్నప్పుడల్లా నోళ్లు కట్టబడిపోతున్నాయి. మేము ప్రతిదినమూ మా ఆటస్థలానికి పోయి ఒంటరిగా సైతాన్ని గూర్చి మాట్లాడుకునే వాళ్ళం. అసలు మాకు సైతాను ప్రసక్తి తప్ప మిగతా ప్రాపంచిక విషయాలన్నీ శూన్యమైనవిగా తోచసాగాయి. సైతాన్ని గూర్చి, అతడు చేసిన పనులను గూర్చి ఎంతసేపు మాట్లాడుకున్నా విసుగు పుట్టేది కాదు. రోజురోజుకీ, రాత్రిరాత్రికీ ఎదురుచూసే వాళ్ళం సైతాను వస్తాడేమోనని. ఆటలు, పాటలు అన్నీ మానేసి దుర్భరమైన నిరీక్షలో యుగాలుగా కాలం వెళ్ళబుచ్చేవాళ్ళం. సైతాను చేసిన విచిత్రాలు, అతడు తిరిగిన లోకాలు, అతడు చూపిన ప్రాచీన యుగాల దృశ్యాలు ఇవన్నీ తలుచుకుంటే మా తోటిబాలుర ఆటలు, వినోదాలు క్షుద్రాతిక్షుద్రాలుగా కనిపించాయి.

మొదటిరోజున ఒకవిషయంమాత్రం మమ్మల్ని విపరీతంగా బాధించింది. ఆరోజల్లా ఫాదర్ పీటర్ ఇంటికి తడవతడవకూ వెళ్ళి వాకబుచేసి వచ్చాము. మా భయం మరేమీ లేదు—మాయ వస్తువులు మంత్రం ఉన్నంతవరకే ఉంటాయి; మంత్రం విచ్చిపోగానే వస్తువులుకూడా మాయమైపోతాయి. అలాగే ఫాదర్ పీటర్ వద్ద ఉన్న బంగారు నాణాలు కూడా

మట్టిగానో, బూడిదగానో మారిపోతాయేమో, లేక మాయమైపోతాయోనని ఎంతో భయపడ్డాము. కాని అలాంటిదేమీ జరగలేదు. అది నిజమైన బంగారమేనని అప్పుడు మాకు ధైర్యం కలిగి, నిశ్చింతగా నిద్రపోయాము.

ఫాదర్ పీటర్‌ను ఒక విషయం అడగాలని తహతహపడ్డాము. రెండోరోజు సాయంత్రం ఆయనదగ్గిరికి వెళ్లి కాసేపు ఆయన పనుల్లో సాయం చేశాము. జంకుతూ జంకుతూ చివరికి ధైర్యంచేసి నేనే అడిగాను: "ఫాదర్! ధర్మాధర్మ విచక్షణ అంటే, ఏమిటి?"

ఫాదర్ పీటర్ నా ప్రశ్న విని ఆశ్చర్యపడ్డాడు. కళ్ళజోడు ముక్కు చివరికి లాగి నాకేసి చూస్తూ,

"ఇది ధర్మం, ఇది అధర్మం అని తెలుసుకోగల శక్తిని ధర్మాధర్మవిచక్షణం అంటారు" అన్నాడు.

ఆయన సమాధానం నన్నంతగా తృప్తి పరచలేదు. సందేహంగా ఆయనకేసి చూశాను. ఇంకా ఏమడుగుతానో అన్నట్టు ఆయన కూడా నాకేసే చూశాడు. చివరికి గొంతు పెకల్చుకొని అడిగాను: "ఆ విచక్షణజ్ఞానం ఉండటం అవసరమా?"

"అవసరమా? నీకేమన్నా మతిపోయిందా? ఆ జ్ఞానం లేకపోతే మానవుడు పశుప్రాయుడే సమానం. పశువులు ఆ జ్ఞానం లేకపోవటంవల్లనే శాశ్వతమరణం

పొందుతాయి. మానవులకా జ్ఞానం ఉన్నందువల్లనే శాశ్వత జీవితానికి వారసులవుతారు."

ఫాదర్ పీటర్ ఇలా చెప్పిన తరవాత ఇంకే మధగాలో జ్ఞాపకం రాలేదు. ఒక్కొక్కసారి ఏదన్నా తిన్నప్పుడు కడుపు నిండినట్టు ఉంటుంది గాని తృప్తి కలగదు. అలాగే ఫాదర్ పీటర్ సమాధానం విన్నాము గాని మా సందేహం తీర లేదు.

ఫాదర్ పీటర్ దగ్గిర్నించి తప్పకుని ఇంట్లోకి వెళ్లాం. మార్గరెట్ కనిపించింది. ఆమె మేరీ లూగర్ అనే అమ్మాయికి పియానో నేర్పుతోంది. ఫాదర్ పీటర్‌కు అదృష్టం పట్టిన తరవాత మొట్టమొదటగా మార్గరెట్ దగ్గిరికి వచ్చింది ఆ అమ్మాయే. ఆ పిల్ల తండ్రి ఊళ్లో మంచిపలుకుబడిగల ఆసామీ. ఆమెను చూసి మిగతా పిల్లలు కూడా క్రమంగా మార్గరెట్ దగ్గిరికి వస్తారని మాలో మేము అనుకున్నాము.

మార్గరెట్ మమ్మల్ని చూడగానే గబగబ వచ్చి తన్నూ, తన పినతండ్రినీ రక్షించినందుకు కృతజ్ఞత తెలిపింది. ఆమె అలా కృతజ్ఞత తెలపటం అది మూడోసారి. రక్షించింది మేము కాదని ఎన్నిసార్లు చెప్పినా ఆమె వినిపించుకోలేదు.

మేము ఇంట్లోంచి తోటలోకి వచ్చాము. తోట కంచెమీద విల్హెల్మ్ మీడ్లింగ్ కూర్చుని ఉన్నాడు. ఫాదర్ పీటర్ కష్టదినాల్లో ఉన్నప్పుడు ఊళ్లో అందరూ ఆయన్నీ, మార్గరెట్‌నీ వెలివేసినట్టు చూశారు

గాని విల్హెల్మ్ మిొాక్లింగ్ మాత్రం ఆ కుటుంబాన్ని విడవలేదు. మార్గరెట్‌పై అతనికి గాఢమైన ప్రేమ ఉందనటానికి అదే నిదర్శనం. ప్రతిసాయంత్రం ఆనడు తోటకంచెమీద కూర్చుని మార్గరెట్ కోసం ఎదురు చూసేవాడు. మార్గరెట్ ఇంటిపనులు త్వరత్వరగా ముగించుకుని వచ్చేది. ఇద్దరూ కలిసి ఊరిబైటికి షికారుగా చేయీచేయీ కలిపి వెళ్ళేవారు. మిొాక్లింగ్ కొత్తగా లాయరువృత్తి ప్రారంభించాడు. నెమ్మదినెమ్మదిగా పేరులోకి వస్తున్నాడు. అంతపెద్ద తెలివితేటలు గల మనిషి అనటానికి వీల్లేదుగాని సుందరమైన ఆకారం, దానికితగ్గ మంచిహృదయం గలవాడనటం చేత, అతనికని బాగానే ఉంది.

మమ్మల్ని చూసి 'మార్గరెట్ పాఠం ఎంత వరకూ వచ్చిం'దని అడిగాడు. 'అయిపోవచ్చిం' దని సమాధానము ఇచ్చాము, మాకు తెలియకపోయినప్పటికీ. మాకు తెలుసు ఆ జవాబుతో మిొాక్లింగ్ సంతోషపడతాడని. మా మాట వినగానే అతని ముఖం చేటంత అయింది.

## 5

నాలుగో రోజున ఎప్పుడూ ఇల్లు కదలని జ్యోతిష్కుడు ఊళ్ళోకి వచ్చాడు. ఎవరో అతని చెవిలో ఊదివుంటారు ఫాదర్ పీటర్‌కు ధనం దొరికినట్టు. ముందుగ మమ్మల్ని వెదికి పట్టుకున్నాడు.

చాటుకు పిలిచి అంతా భోగట్టా చేశాడు. మేము చెప్ప గలిగినదంతా చెప్పాము. అతనంటే మాకు చచ్చే భయం. అందుచేత వీలైనంతవరకూ అంతా వివరంగా చెప్పాము. జ్యోతిష్కుడు కాసేపు కళ్లు మూసుకుని ఆలోచన చేశాడు. చివరికి కళ్లు తెరిచి అడిగాడు :

"ఎన్ని డకట్లు ఉన్నాయి ఆ సంచిలో ?"

"పదకొండువందల ఏడు డకట్లు ఉన్నాయండి."

జ్యోతిష్కుడు తనలో తను గొణుక్కుంటు న్నట్టు అన్నాడు: "చిత్రంగా ఉందే! అవును, చాలా చిత్రంగా వుంది. ఎలా జరిగి ఉంటుంది?"

తరవాత మళ్ళీ మొదట్నించీ చెప్పమన్నాడు. జరిగినదంతా మళ్ళీ ఏకరువు పెట్టాము. అంతా విని "కాస్తాకూస్తా కాదు. పదకొండువందల ఆరు డకట్లు!" అన్నాడు.

"ఆరు కాదు, ఏడు" అన్నాడు సెప్పీ.

"ఏడా? ఆరు కాదూ? ఇందాక ఆరే అన్నా వుగా ?"

'ఇందాక ఆరు అనలేదు, ఏడే అన్నాము' అంటే జ్యోతిష్కుడు 'అయితే నేను అబద్ధమాడా నంటారా ?' అని విరుచుకుపడతాడు. అతనితో జగడం పెట్టుకోవటం క్షేమం కాదు. అందుకని నికొ లాస్ వినయంగా,

"కాదు సార్! ఇందాక ఆరు అనబోయి ఏడు అన్నాము. మాదే పొరబాటు. నిజానికి పదకొండు వందల ఏడు డకట్లు దొరికాయి," అని అన్నాడు.

"ఫరవాలేదులే అబ్బాయ్! ఒకటి ఎక్కువైనా తక్కువైనా ఇబ్బంది లేదులే. పైగా ఇన్నిరోజులైన తరవాత మీకు మాత్రం జ్ఞాపకం ఉంటుందా సరిగా ఎన్ని డకట్లు దొరికాయో?"

"కాదు సార్! మాకు బాగా జ్ఞాపకం ఉంది. జ్ఞాపకం ఉండటానికి కారణంకూడా వుంది," అన్నాడు సెప్పీ.

"ఏమి టది?"

"మొదట ఫాదర్ పీటర్, తరవాత థియొడోర్, తరవాత నికొలాస్ వరసగా మూడు సార్లు లెక్కపెట్టారు. వాళ్లు లెక్కపెట్టటానికి ముందే నేను తమాషా చేద్దామని ఒక డకట్ తీసి దాచాను. పదకొండు వందల ఆరు డకట్లు లెక్కకు వచ్చాయి. అప్పుడు నేను వాళ్లు చూడకుండా దాచిన డకట్ మళ్లీ కలిపాను. 'మీరు తప్పు లెక్కపెట్టారు. మళ్లీ ఈసారి లెక్కపెట్టండి,' అన్నాను. మళ్లీ లెక్కపెట్టే టప్పటికి పదకొండువందలఏడు డకట్లు లెక్క వచ్చింది. అందుచేత మాకు డబ్బు ఎంత దొరికిందో స్పష్టంగా జ్ఞాపకం వుంది."

"నిజమేనా?" అని జ్యోతిష్కుడు మమ్మల్ని అడిగాడు. అవునని మేము తలకాయ లూగించాము.

